# అథ ఏక పంచాశత్తమో%ధ్యాయః

# ఉష పార్వతీ రూపమును దాల్చుట

వ్యాస ఉవచ|

సనత్కుమార సర్వజ్ఞ శ్రావితా సుకథా%ద్భుతా |
భవతానుగ్రహాత్రీత్యా శంభ్వనుగ్రహ నిర్భరా || 1

ఇదానీం శ్రోతుమిచ్ఛామి చరితం శశిమౌలినః | గాణపత్యందదౌ
ప్రీత్యా యథా బాణాసురాయ వై || 2

వ్యాసుడిట్లు పలికెను -

ఓ సనత్కుమారా! నీవు సర్వజ్ఞుడవు. నీ అనుగ్రహముచే శంభుని ప్రసాదముతో తొణికిసలాడే అద్భుతమగు మంచి గాథను ప్రీతితో వింటిని (1). చంద్రశేఖరుడు బాణాసురునకు ప్రేమతో గణాధ్యక్ష పదవిని ఇచ్చిన వృత్తాంతమునిపుడు వినగోరుచున్నాను (2).

సనత్కుమార ఉవాచ |

శృణు వ్యాసాదరాత్తాం వై కథాం శంభోః పరాత్మనః | గాణపత్యం
యథా ప్రీత్యా దదౌ బాణాసురాయు హి || 3

అత్రైవ సుచరిత్రం చ శంకరస్య మహాప్రభోః | కృష్ణేన
సమరో%ప్యత్ర శంభోర్బాణాను గృహ్ణతః || 4

అత్రానురూపం శృణు మే శివలీలాన్వితం పరమ్ | ఇతిహాసం
మహాపుణ్యం మనశ్శ్రోత్రసుఖావహమ్ || 5

బ్రహ్మపుత్రో మరీచిర్యో మునిరాసీన్మ హామతిః |
మానసస్సర్వపుత్రేషు జ్యేష్ఠశ్శ్రేష్ఠః ప్రజాపతిః || 6

తస్య పుత్రో మహాత్మాసీత్కశ్యపో మునిసత్తమః |
సృష్టిప్రవర్ధకో%త్యంతం పితుర్భక్తో విధేరపి || 7

తస్య త్రయోదశమితా దక్షకన్యాస్సుశీలకాః | కశ్యపస్య మునేర్వ్యాస పత్న్యశ్చాసన్ పతివ్రతాః || 8

తత్ర జ్యేష్ఠా దితిశ్చాసీ ద్దైత్యాస్తత్త నయాస్స్మృతాః | అన్యాసాం చ సుతా జాతా దేవాద్యాస్సచరాచరాః || 9

సనత్కుమారుడిట్లు పలికెను-

ఓ వ్యాసా! శంభు పరమాత్మ ప్రేమతో బాణాసురునకు గణా ధ్యక్ష పదివిని ఇచ్చిన ఆ గాథను వినుము (3). ఈ గాథలో మహా ప్రభుడు, మంగళకరుడు అగు శంభుడు బాణుని యందలి అనుగ్రహముచే కృష్ణునితో యుద్ధమును కూడా చేసిన వైనము గలదు (4). శివుని లీలలతో గూడినది, మహాపుణ్యప్రదము, చెవులకింపైనది, మనస్సునకు సుఖమునిచ్చునది, యోగ్యమైనది అగు ఈ చరిత్రను చెప్పెదను వినుము (5). బ్రహ్మగారికి మహా బుద్ధిశాలి, పుత్రులందరిలో జ్యేష్ఠుడు, శ్రేష్ఠుడు, ప్రజాపతి అగు మరీచి మహర్షియను మానస పుత్రుడు గలడు (6). ఆయనకు మహాత్ముడు, తండ్రియందు తాతయగు బ్రహ్మయందు భక్తి గలవాడు, సృష్టిని అధికముగా వర్ధిల్ల జేసినవాడు అగు కశ్యపమహర్షి యను పుత్రుడు గలడు (7). ఓ వ్యాసా! ఆ కశ్యపమహర్షికి దక్షుని కుమార్తెలు, మంచి శీలము గలవారు, పతివ్రతలు అగు పదముగ్గురు భార్యలు గలరు (8). వారిలో దితి పెద్ద భార్య. ఆమె పుత్రులకు దైత్యులని పేరు. మిగిలిన భార్యలకు దేవతలు మెదలగు స్థావరజంగమాత్మకమగు సర్వప్రాణులు సంతానముగా కలిగిరి (9).

జ్యేష్ఠాయాః ప్రథమౌ పుత్రౌ దితేశ్చాస్తాం మహాబలౌ | హిరణ్యకశిపుర్జ్యేష్ఠో హిరణ్యాక్షో%నుజస్తతః || 10

హిరణ్యకశిపోః పుత్రాశ్చత్వారో దైత్యసత్తమాః | హ్రదానుహ్రాద సంహ్రాద ప్రహ్లాదాశ్చేత్యను క్రమాత్ || 11

ప్రహ్లాదస్తత్ర హి మహాన్ విష్ణుభక్తో జితేంద్రియః | యం నాశితుం న శక్తాస్తే%భవన్ దైత్యాశ్చ కే% పి హ || 12

విరోచనస్సుతస్తస్య మహాదాతృవరో% భవత్ | శక్రాయ స్వశిరో యో%దా ద్యాచమానాయ విప్రతః || 13

తస్య పుత్రో బలిశ్చాసీన్మహాదానీ శివప్రియః | యేన వామనరూపాయ హరయే%దాయి మేదినీ || 14

తస్యౌరసస్సుతో బాణశ్శివభక్తో బభూవ హ | మాన్యో వదాన్యో ధీమాంశ్చ సత్య సంధస్సహస్రదః || 15

శోణితాఖ్యే పురే స్థిత్వాస రాజ్యమకరోత్పురా | త్రైలోక్యం చ బలాజ్జిత్వా తన్నాథానసురేశ్వరః || 16

తస్య బాణాసురస్యై#్యవ శివభక్తస్య చామరాః | శంకరస్య ప్రసాదేన కింకరా ఇవ తే%భవనం || 17

తస్య రాజ్యే%మరాన్ హిత్వా నాభవన్ దుఃఖితాః ప్రజాః | సాపత్న్యా దుఃఖితాస్తే హి పరధర్మప్రవర్తినః || 18

సహస్రబాహువాద్యేన స కదాచిన్మహాసురః | తాండవేన హి నృత్యేనాతోషయత్తం మహేశ్వరమ్ || 19

తేన నృత్యేన సంతుష్ట స్సుప్రసన్నో బ భూవ హ | దదర్శ కృపయా దృష్ట్యా శంకరో భక్తవత్సలః || 20

భగవాన్ సర్వలోకేశశ్శరణ్యో భక్తకామదః | వరేణ చ్ఛందయామాస బాలేయం తం మహాసురమ్ || 21

పెద్ద భార్యయగు దితికి మహాబలశాలురగు ఇద్దరు పుత్రులు మొదటి సంతాన ముగా కలిగిరి. వారిలో హిరణ్యకశిపుడు పెద్దవాడు. హిరణ్యాక్షుడు రెండవవాడు (10). హిరణ్యకశిపునకు నల్గురు రాక్షసవీరులు పుత్రులై జన్మించిరి. హ్రాదుడు, అనుహ్రాదుడు, సంహ్రాదుడు, ప్రహ్రాదుడు అనునవి వారి పేర్లు (11). వారిలో ప్రహ్రాదుడు గొప్ప విష్ణుభక్తుడు, జితేంద్రియుడు. ఆతనిని రాక్షసులలో అనేకులు సంహరించుటకు ప్రయత్నించి విఫలులైరి (12). మహాదాతయగు విరోచనుడు అతని పుత్రుడు. బ్రాహ్మణ వేషములో వచ్చి యాచించిన ఇంద్రునకు ఆయన తన శిరస్సును

ఇచ్చి వేసెను (13). అతని కుమారుడగు బలి మహాదాత, శివునకు ప్రీతిపాత్రుడు. వామన రూపములో వచ్చిన విష్ణువునకు అతడు భూమిని ఇచ్చి వేసెను (14). శివభక్తుడు, ఆదరణీయుడు, దాత, బుద్ధిశాలి, సత్య నిష్ఠ గలవాడు, అసంఖ్యాకములగు వస్తువులను దానము చేసినవాడు అగు బాణాసురుడు అతని పుత్రుడు (15). ఆ రాక్షస వీరుడు పూర్వము ముల్లోకముల ప్రభువులను తన శక్తిచే జయించి శోణితనగరమునందుండి రాజ్యము నేలెను (16). శివభక్తుడగు ఆ బాణాసురునకు శంకరుని అనుగ్రహముచే దేవతలు కింకరులవలె ఉండిరి (17). ఆతని ఏలికలో దేవతలు తప్ప ప్రజలు దుఃఖమునెరుంగరు. ఆతని జ్ఞాతులగు దేవతలు దుఃఖితులైరి. వారు ఆతని యందు శత్రుబుద్ధి గలవారై దుఃఖముల పాలైరి (18). ఆ మహారాక్షసుడు ఒకప్పుడు వేయి చేతులతో మృదంగమును వాయించి తాండవ నృత్యమును చేసి మహేశ్వరుని సంతోషపెట్టెను (19). భక్తవత్సలుడగు శంకరుడు ఆ నృత్యమునకు సంతసించి మిక్కిలి ప్రసన్నుడై ఆతనిని దయాదృష్టితో చూచెను (20). సర్వలోక ప్రభువు, శరుణు పొంద దగినవాడు, భక్తుల కోర్కెల నీడేర్చువాడు అగు ఆ భగవానుడు బలిపుత్రుడగు ఆ మహారాక్షసుని వరమును కోరుకొనుమనెను (21).

బాలేయస్స మహాదైత్యో బణో భక్తవరస్సుధీః | ప్రణమ్య శంకరం భక్త్యా నునావ పరమేశ్వరమ్ || 22

బలి పుత్రుడు, గొప్ప భక్తుడు, గొప్ప బుద్ధిశాలి, మహారాక్షసుడు నగు ఆ బాణుడు మంగళకరుడగు పరమేశ్వరునకు భక్తితో ప్రణమిల్లి స్తుతించెను (22).

బాణాసుర ఉవాచ |

దేవదేవ మహాదేవ శరణాగతవత్సల | సంతుష్టా%సి మహేశాన మమోపరి విభో యది || 23

మద్రక్షకో భవ సదా మదుపస్థః పురాధిపః | సర్వథా ప్రీతికృన్మే హి సనుతస్సగణః ప్రభో || 24

బాణాసురుడిట్లు పలికెను-

ఓ దేవదేవా! మహాదేవ! శరణు జొచ్చినవారియందు ప్రేమను జూపే ఓ మహేశ్వరా! విభూ! నా విషయములో నీవు సంతుష్టుడవైనచో (23), సర్వదా నా సమీపమునందుండి ఈ నగరమునకు అధ్యక్షుడవై నన్ను రక్షించుము. ఓ ప్రభూ! నీవు నీ కుమారులతో మరియు గణములతో గూడి అన్ని విధములుగా నాకు ప్రీతిని కలిగించుము(24).

సనత్కుమార ఉవాచ |

బలిపుత్రస్స వై బాణో మోహితశ్శివ మాయయా| ముక్తిప్రదం మహేశానం దురారాధ్యమపి ధ్రువమ్ || 25

స భక్త వత్సల శ్శంభుర్దత్త్వా తస్మై#ం వరాంశ్చ తానం | తత్రోవాస తథా ప్రీత్యా సగణస్ససుతః ప్రభుః || 26

స కదాచిద్బాణపురే చక్రే దేవానురైస్సహ | నదీతీరే హరః క్రీడాం రమ్యే శోణితకాహ్వయే || 27

ననృతుర్జహసుశ్చాపి గంధర్వాప్సరసస్తథా | జేపుః ప్రణ   మురుర్మునయ ఆనర్చుస్తుష్టువుశ్చ తమ్ || 28

వవల్గుః ప్రమథాస్సర్వే ఋషయో జుహవుస్తథా | ఆయయుస్సిద్ధసంఘాశ్చ దదృశుశ్శాంకరీం రతిమ్ || 29

కుతార్కికా వినేశుశ్చ వ్ల   ంచ్ఛాశ్చ పరిపంథినః | మాతరో%భిముఖాస్త స్థుర్వినేశుశ్చ బిభీషికాః || 30

రుద్రసద్భావభక్తానాం భవదోషాశ్చ విస్తృతాః| తస్మినం దృష్టే ప్రజాస్సర్వాస్సు ప్రీతిం పరమాం యయుః || 31

వవల్గుర్మునయస్సిద్ధాస్త్రీస్ ణాం దృష్ట్వా విచేష్టితమ్ | పుపుషుశ్చాపి ఋతవస్స్వప్రభావం తు తత్ర చ || 32

వవుర్వాతాశ్చ మృదవః పుష్పకేసరధూసరాః | చుకూజుః పక్షిసంఘాశ్చ శాఖినాం మధులంపటాః || 33

పుష్పభారావనద్ధానాం రారట్యేరంశ్చ కోకిలాః | మధురం కామజననం వనేషూపవనేషు చ || 34

తతః క్రీడావిహారే తు మత్తో బాలేందుశేఖరః | అనిర్జితేన కామేన దృష్టః ప్రోవాచ నందినమ్ || 35

సనత్కుమారుడిట్లు పలికెను-

బలిపుత్రుడగు ఆ బాణాసురుడు శివమాయచే మోహితుడై ముక్తిని ఇచ్చువాడు, మిక్కిలి క్లేశముతో ఆరాధించదగినవాడు, శాశ్వతుడు అగు మహేశ్వరుని ఇట్లు కోరెను(25). భక్తవత్సలుడగు ఆ శంభు ప్రభుడు ఆతనికి ఆ వరములనిచ్చి అచట గణములతో మరియు పుత్రులతో గూడి ప్రేమతో నివసించెను (26). ఒకనాడు ఆ శివుడు బాణుని నగరము అగు శోణితపురములో దేవతలతో మరియు రాక్షసులతో గూడి సుందరమగు నదీతీరమునందు విహరించెను (27). అపుడు గంధర్వులు, అప్సరసలు నాట్యమాడుతూ నవ్వుచుండిరి. మునులు జపమును చేయుచూ ఆయనకు నమస్కరించి పూజించి స్తుతించిరి (28). ప్రమథులందరు కేకలు వేయుచుండిరి. ఋషులు హెూమములను చేయుచుండిరి. శంకరుని విలాసమును దర్శించుటకు సిద్ధుల గణములు వచ్చిరి (29). దుష్టతార్కికులు, ప్ల ెచ్ఛులు మరియు శత్రువులు వినాశమును పొందిరి. మాతృదేవతలు అభిముఖముగా నిలబడిరి. భయకారణములు నశించినవి (30). రుద్రునియందు సద్భావము గల భక్తుల సంసారదోషములు విస్మరించబడినవి. ఆయనను దర్శించి ప్రజలందరు పరమానందమును పొందిరి (31). స్త్రీల చేష్టలను గాంచి మునులు, సిద్ధులు కేకలు వేసిరి. అచట ఋతువులు తమ ప్రభావమును పోషించినవి (32). పుష్పముల పుప్పొడితో నిండియున్న వాయువులు సుఖస్పర్శ కలుగునట్లు వీచినవి. వృక్షములందలి మధువునందు తృష్ణగల పక్షుల సమూహములు కూసినవి. (33) పుష్పముల బరువుతో వంగిన కొమ్మలు గల వృక్షములతో నిండియున్న వనములయందు,

ఉద్యానవనములలో కోకిలలు మధురముగా కామోద్దీపనము కలుగునట్లుగా కూసినవి (34). పరాజితుడు గాని మన్మథునిచే చూడబడి విహారోత్సుకుడై యున్న చంద్ర శేఖరుడు అచట క్రీడలు, విహారములు కొనసాగుచుండగా అపుడు నందితో నిట్లనెను (35).

చంద్రశేఖర ఉవాచ |

వామా మానయ గౌరీం త్వం కైలాసాత్కృతమండనామ్ | శీఘ్ర మస్మాద్వనాద్గత్వా హ్యుక్త్వా కృష్ణా మిహానయ || 36

చంద్ర శేఖరుడిట్లు పలికెను-

నీవు వెంటనే ఈ వనమునుండి కైలాసమునకు వెళ్లి సుందరి, కృష్ణవర్ణము గలది, అలంకరించుకున్నది యగు పార్వతిని ఈ విషయము చెప్పి ఇచటకు తీసుకొని రమ్ము (36).

సనత్కుమార ఉవాచ |

స తథేతి ప్రతిజ్ఞాయ గత్వా తత్రాహ పార్వతీమ్ | సుప్రణమ్య రహో దూతశ్శంకరస్య కృతాంజలిః || 37

సనత్కుమారుడిట్లు పలికెను-

శివుని ఆ రహస్యదూత చేతులు జోడించి ప్రణమిల్లి 'చిత్తము' అని పలికి, అచటకు వెళ్లి పార్వతితో నిట్లు పలికెను (37).

నందీశ్వర ఉవాచ |

ద్రష్టుమిచ్ఛతి దేవి త్వాం దేవదేవో మహేశ్వరః | స్వవల్లభాం రూపకృతాం మయోక్తం తన్ని దేశతః || 38

నందీశ్వరుడిట్లు పలికెను-

ఓ దేవీ! దేవ దేవుడగు మహేశ్వరుడు తన ప్రియురాంలగు నీవు ఆలంకరించు కొని యుండగా చూడ గోరుచున్నాడు. ఆయన ఆదేశముచే నేనీ సందేశమును చెప్పుచున్నాను (38).

సనత్కుమార ఉవాచ |

తతస్తద్వచనాద్గౌరీ మండనం కర్తు మాదరాత్ | ఉద్యతాభూన్మ్ముని శ్రేష్ఠ పతివ్రత పరాయణా || 39

ఆగచ్ఛామి ప్రభుం గచ్ఛ వద తం త్వం మమాజ్ఞయా | ఆజగామ తతో నందీ రుద్రాసన్నం మనోగతిః || 40

పునరాహ తతో రుద్రో నందినం పరవిభ్రమః | పునర్గచ్ఛ తతస్తాత క్షిప్రమానయ పార్వతీమ్ || 41

బాఢముక్త్వా స తాం గత్వా గౌరీమాహ సులోచనామ్ ద్రష్టుమిచ్ఛతితే భర్తా కృతవేషాం మనోరమామ్ || 42

శంకరో బహుధా దేవి విహర్తుం సంప్రతీక్షతే | ఏవం పతౌ సుకామార్తే గమ్యతాం గిరినందిని || 43

అప్సరోభిస్సమగ్రా భిరన్యోన్య మభిమంత్రి తమ్ | లబ్ధ భావో యథా సద్యః పార్వత్యా దర్శనోత్సుకః || 44

అయం పినాకీ కామరిః వృణుయాద్యాం నితంబినీమ్ | సర్వాసాం దివ్య నారీణాం రాజ్ఞీ భవతి వై ధ్రువమ్ || 45

వీక్షణం గౌరి రూపేణ క్రీడయేన్మ న్మథైర్గణైః | కామో%యం హంతి కామారి మూచురన్యోన్య మాదృతాః || 46

స్ప్రష్టుం శక్నోతి యా కాచిదృతే దాక్షాయణీం స్త్రియమ్ | సా గచ్ఛేత్తత్ర నిశ్శంకం మోహయే త్పార్వతీ పతిమ్ || 47

కుంభాండ తనయా తత్ర శంకరం స్ప్రష్టుముత్సహే | అహం గౌరీ సురూపేణ చిత్రలేఖా వచో%బ్రవీత్ || 48

సనత్కుమారుడిట్లు పలికెను -

ఓ మహర్షీ! ఆతని ఆ మాటను విని పాతివ్రత్యనిష్ఠ గల ఆ గౌరి అలంకరించు కొనుటకు ఉత్యతురాలయ్యెను (39). 'నీవు నా ఆజ్ఞచే వెళ్లి ప్రభుని తో నేను వచ్చుచున్నానని చెప్పుము' అని ఆమె

పలుకగా నంది అపుడు మనోవేగముతో రుద్రుని సన్నిధికి వచ్చెను (40). అపుడు రుద్రుడు మిక్కిలి కంగారు పడు చున్నవాడై నందితో 'వత్సా! మరల వెళ్లి పార్వతిని వెటనే దోడ్కొనిరమ్ము' అని మరల ఆదేశించెను (41). ఆతడు సరేనని పలికి సుందరియగు పార్వతి వద్దకు వెళ్లి ఆమెతో నిట్లనెను:అలంకరించుకొని మనోహర ముగానున్న నిన్ను నీ భర్త చూడగోరుచున్నాడు (42). ఓదేవి! శంకరుడు పలుభంగుల విహరించుటకై ఎదురు చూచుచున్నాడు. ఓ పార్వతీ! భర్త ఇట్లు మిక్కిలి ఉత్కంఠ గలవాడై యుండ వెడలుట యుక్తము (43). అప్సరసలు అందరు తమలో తాము ఇట్లు చర్చించు కొనిరి: ఈ శివుని మనస్సులో ఉదయించిన విహారేచ్ఛ గల వాడై వెనువెంటనే పార్వతిని చూడవలననే ఉత్కంఠతో నున్నాడు (44). పినాక ధారి, కామవిజేతయగు ఈ శివుడు ఏ సుందరిని ఎన్నుకొనునో, ఆమె దేవతాస్త్రీలందరిలో నిస్సందేహముగా రాణి యగును (45). అట్టి స్త్రీ పార్వతీ రూపములో మన్మథుని గణములతో గూడి ఈయనను దర్శించవచ్చును. అపుడు ఈ మన్మథుడు కామ విజేతయగు శివునిపై విజయమును పొందునని వారు తమలో తాము ఆదరముతో పలుకు చుండిరి (46). పార్వతి తక్క ఇతర స్త్రీలు ఆయనను స్పృశించలేరు. కాని ఎవరైననూ అట్లు చేయగలమనుకున్నచో వారు ఆయన వద్దకు నిశ్శంకగా వెళ్లి పార్వతీప్రియుడగు ఆయనను మోహింప జేయవచ్చునని వారు పలికిరి (47). అపుడు కుంభాండుని కుమార్తెయగు చిత్రలేఖ ఇట్లు పలికెను: నేను సుందరియగు పార్వతి రూపమును దాల్చి శంకరుని స్పృశించుటకు ఉత్సాహపడు చున్నాను (48).

యదధాన్మోహినీరూపం కేశవో%ి మోహనేచ్ఛయా | పురా తద్వైష్ణవం యోగమా శ్రిత్య పరమార్థతః || 49

ఉర్వశ్యాశ్చ తతో దృష్ట్వా రూపస్య పరివర్తనమ్ | కాలీరూపం ఘృతాచీ తు విశ్వాచీ చాండికం వపుః || 50

సావిత్రిరూపం రంభా చ గాయత్రం మేనకా తథా| సహజన్యా జయారూపం వైజయం పుంజికస్థలీ || 51

మాతౄణామప్యనుక్తానామనుక్తా శ్చాప్సరో వరాః | యత్నా ద్రూపాణి తాశ్చక్రు స్స్వవిద్యాసంయుతా అను || 52

తతస్తాసాం తు రూపాణి దృష్ట్వా కుంభాండ నందినీ | వైష్ణవాదాత్మయోగాచ్చ విజ్ఞాతార్థా వ్యడంబయత్ || 53

ఉషా బాణా సుర సుతా దివ్యయోగ విశారదా | చకార రూపం పార్వత్యా దివ్యమత్యద్భుతం శుభమ్ || 54

మహారక్తాబ్జ సంకాశం చరణం చోత్తమ ప్రభమ్ | దివ్యలక్షణసంయుక్తం మనో%భీష్టార్థ దాయకమ్ || 55

తస్యా రమణ సంకల్పం విజ్ఞాయ గిరిజా తతః | ఉవాచ సర్వవిజ్ఞానా సర్వాంతర్యామినీ శివా || 56

పూర్వము విష్ణువు దానవులను మోహింప జేయ గోరి తన వైష్ణవశక్తిని ఆశ్రయించి యథార్థమగు మోహినీరూపమును దాల్చెను గదా! అని చిత్ర లేఖ పలికెను (49). అపుడు ఊర్వశియొక్క రూపపరివర్తనమును గాంచి ఘృతాచి కాళీరూపమును, విశ్వాచి చండికారూపమును దాల్చిరి (50). రంభ సావిత్రీరూపమును, మేనక గాయత్రీరూపమును, సహజన్య జయారూపమును, పుంజికస్థలి విజయారూపమును దాల్చిరి (51). ఇంకనూ ఇతర అప్సరసలు ఇతర మాతృమూర్తుల రూపములను తమ విద్యల ప్రభావముచే ప్రయత్నపూర్వకముగా దాల్చిరి (52). కుంభాండుని కుమార్తె అపుడు వారి రూపములను గాంచి విష్ణువుయొక్క ఆరాధనచే సిద్ధించిన స్వీయయోగ శక్తిచే వారి యథార్థ స్వరూపములను తెలుసు కొని, తాను కూడా వారిని అనుకరించెను (53). బాణాసురుని కుమార్తె యగు ఉష దివ్యశక్తులలో సమర్థురాలు. మిక్కిలి అద్భుతమైనది, శుభకరమైనది అగు పార్వతీ దేవి యొక్క రూపతమును ఆమె దాల్చెను (52). ఉత్తమమగు కాంతులను వెదజల్లే ఆమె పాదములు పెద్ద ఎర్రని పద్మమును పోలి, దివ్యలక్షణములతో గూడినవై భక్తుల అభీష్టముల నీడేర్చు

చుండెను (55). అపుడు విహరించవలెననే ఆమె యొక్క సంకల్పమునెరింగి సర్వజ్ఞురాలు, సర్వాంతర్యామిని, శివుని ప్రియురాలు అగు పార్వతి ఇట్లు పలికెను (56).

గిరిజోవాచ |

యతో మమ స్వరూపం వై ధృతమూపే సఖి త్వయా | సకామత్వేన సమయే సంప్రాప్తే సతి మానిని || 57

అస్మింస్తు కార్తికే మాసి ఋతు ధర్మాస్తు మాధవే | ద్వాదశ్యాం శుక్లపక్షే తు యస్తు ఘోరే నిశాగమే || 58

కృతోపవాసాం త్వాం భోక్తా సుప్తా మంతఃపురే నరః | స తే భర్తా కృతో దేవైస్తేన సార్ధం రమిష్యసి || 59

ఆ బాల్యాద్విష్ణు భక్తాసి యతో%నిశమతంద్రితా | ఏవమస్త్వితి సా ప్రాహ మనసా లజ్జితాననా || 60

అథ సా పార్వతీ దేవీ కృతకౌతుక మండనా | రుద్రసన్నిధిమా గత్య చిక్రీడే తేన శంభునా || 61

తతో రతాంతే భగవాన్రుద్రశ్చా దర్శనం య¸° | సదారస్స గణశ్చాపి సహితో దైవతైర్మునే || 62

ఇతి శ్రీ శివమహాపురాణ   రుద్రసంహితాయాం యుద్ధ ఖండే ఉషాచరిత్ర వర్ణనం నామ ఏకపంచాశత్త మో%ధ్యాయః (57).

పార్వతి ఇట్లు పలికెను-

ఓ ఉషా! సఖీ! నీవు సరియగు సమయములో కామనతో గూడిన మనస్సు గలదానవై నా రూపమును దాల్చితివి. ఓ అభిమానవతీ! కావున (57), నీవు ఈ కార్తీక మాసములో ఋతుధర్మమును కలిగియుందువు. వైశాఖ శుక్లద్వాదశినాడు భయంకరమగు అర్ధరాత్రియందు (58), ఉపవసించి అంతఃపురములో నివసించియున్న నిన్ను ఒక నరుడు భోగించగలడు. వాడే నీకు భర్తయని దేవతలు నిర్దేశించినారు. నీవు వానితో రమించగలవు

(59). నీవు చిన్నదనమునుండియు పొరపాటు లేకుండగా విష్ణువును ఆరాధించియుంటివి. ఈ మాటను విని ఉష సిగ్గుతో నిండిన మోముగలదై మనస్సులో అటులనే యగుగాక ! అనుకొనెను (60). అపుడా పార్వతి చక్కగా అలంకరించుకొని మంగళస్వరూపుడగు రుద్రుని సన్నిధికి వచ్చి ఆయనతో కలిసి విహరించెను (61). ఓ మహర్షీ! ఆ విహారము ముగిసిన తరువాత రుద్రభగవానుడు భార్యతో, గణములతో మరియు దేవతలతో గూడి అంతర్ధానమును చెందెను (62).

శ్రీ శివమహాపురాణములోని రుద్రసంహితయందు యుద్ధఖం%్డములో ఉషాచరిత్ర వర్ణనమనే ఏబది ఒకటవ అధ్యాయము ముగిసినది (51).